# జోలపాట

జో అచ్యుతానంత ! జోజో ముకుందా ! రార ! పరమానంద ! రామ
! గోవిందా ! ; అను మాదిరి

జోకృష్ణ ! యదుబాల ! జోజోసుచేలా !
ప. జోచంద్రరవినయన ! జో భోగిశయనా ! ॥ జో జో॥

నిదురబోనాతండ్రి ! నిదురబోవయ్యా !
చ. నిదురబోలోకేశ ! యిదెవచ్చెరాత్రి ! ,,

చీఁకటివిరియించెఁ జిన్ని జాబిల్లి
ఆకసంబునఁజుక్క లలరారెనవిగో ॥ ,,

పసిఁడియుయ్యేలలోఁ బవళించి నీవు
నిసుఁగువై కనుమూసి నిద్రించవయ్య ॥

చెలఁగి సోమకుఁజంపఁ జేపరూపొంది
ప్రళయవారధినీఁది బడలిపోయితివి ॥

బృందారకులకొఱకు మందరంబెత్తి
సుందరకూర్మమై సొలసిపోయితివి ॥

తొలుపందివై యసురఁద్రొక్కిగీటాడి
యిలపైకినెత్తిన జలజపత్రాక్ష ! ॥ ,,

సిసువుఁబ్రోవఁగ మర్త్యసింహరూపమున
నసురనాయకుఁజంపి యలసినతండ్రి ,,

వక్షమున సిరిగలుగువాఁడవైయుండి
భిక్షమెత్తినయట్టి పిన్న బ్రాహ్మణుఁడ ॥ ,,

మదమత్తులైయున్న మానవేశ్వరుల
వెదకి ఖండించిన విశ్వలోకేశ ! ॥ ,,

రామచంద్రుండవై రావణునిఁద్రుంప
భూమి నాయాసంబుఁ బొందినావయ్య ॥ ,,

వ్రేపల్లెలోనిపుడు గోపకాంతలను
జేపట్టిరక్షించు చిన్నికృష్ణయ్య ॥ ,,

ఇలఁబూడివాఁడలో నెలమిమీఱఁగను
వెలసియున్నట్టి శ్రీ వేణుగోపాల ! ॥ ,,

నిదురబో నాతండ్రి ! నిదురబోవయ్య !
నిదురబో సుకుమార ! నిశివచ్చెఁగాన ॥ ॥ జోజో ॥

# మేలుకొలుపు

## " గుమ్మఁడేడే గోపిదేవి వలె "

మేలుకొనరా ! బాలకృష్ణా ! మేలుకొనరా ! మదనరూపా !
మేలుకోవయ్యా కృష్ణయ్యా ! । ।
మేలుకో ॥

తెల్లవారెను గొల్లభామలు చల్లఁజేసిరి వెన్న ముద్దలు
కొల్లలాడఁగవేళమయ్యె మేలుకో